## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000004711

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

# శ్రీనివాస కల్యాణము.

(హరికథ)

* * *

రచయిత.
కవిరత్న నేమాన వేంకటకోటీశ్వరశర్మ. బి.ఏ.,
తిరుపతి.

* * *

పబ్లిషర్సు
శ్రీవేంకటేశ్వరా బుక్ డిపో, తిరుమల.

 1959 [Price: 0-8-0

# శ్రీనివాసమూర్తి

సీ॥ బాలభాస్కరశత ప్రభగలమకుటంబు
లలితమౌ, మకరకుండలయుగంబు
ఖండేందునిభఫాల కస్తూరి తిలకంబు
దరహాసవదన, సుందరముఖంబు
రంగైన యలమేలు మంగయొప్పెడు తాళి
గ్రైవేయ భాసుర కౌస్తుభంబు
కటివాన శంఖచక్రంబులు హస్తంబులు
అతులితకాంతి పీతాంబరంబు.

తే॥ గీ॥ చకిత నవరత్న మంజీరచరణయుగళి
హారకేయూర మణినూపురాది భూష
ణాంచితంబైన నీల నీలాంబుదాగ
మలర నిలచెను వేంకటాచల విభుండు.

# పీఠిక.

—०००—

వృత్తివలన హరిదాసుని కాకపోయినను, భక్తివలన హరిదాసునిగా మారుటయేగాక శ్రీవేంకటేశ్వరస్వామివారి కృపావిశేషమున వారి సేవచేయుటకు కొంచమవకాశము దొరకినందున, శ్రీవారి బ్రహ్మోత్సవసందర్భమున హరికథలు చెప్పుటకు నుద్యుక్తుడనై బ్ర॥శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాస ప్రణీతంబగు రుక్మిణీకల్యాణాది కథలను పఠించి చెప్పునపుడు నాకీ కథ వ్రాయుటకు కోరిక జనించినందునను దానికి కావలయు విరామము లభ్యమైనందున నీ "శ్రీనివాస కల్యాణము"ను వ్రాసి శ్రీవారి దేవాలయమున బ్రహ్మోత్సవ సమయమున చెప్పుటయేగాక, విజయవాడ పురమందుగూడ పలుచోట్ల కోటాన భక్తులయెదుట ప్రదర్శింప గల్గితిని. యీనా చిన్నకైంకర్యమును శ్రీవారు గ్రహించి మన్నింతురుగాక.

ఇట్లు

కవిరత్న నేమాన వేంకటకోటీశ్వరశర్మ.



# పండితాభిప్రాయములు.

1. శ్రీమదాస్థానకవి కవిసార్వభౌమ యిత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. రాజమహేంద్రవరము.



తే॥ గీ॥ శ్రీనివాస కల్యాణము చిత్రగతుల
హరికథగ, గూర్చె నేమాన నరకులాబ్ధి
చంద్రుడైన కోటీశ్వరశర్మ దాని
వినిన, భుక్తియు ముక్తియు వెలయుచుండు.

క॥ నానావిధ రాగంబుల
తోనానాగతులతో నుతులతో, నెంతే
నానందమొసగు హరికథ
దీనిం బఠియింప వినిన, దెఱలు నఘంబుల్.

చ॥ హరికథయందు రాగము
లహో! యనునట్లు మృదుస్వరంబులన్
వరుసలుదీర్చి గీతములు
పాడినమాత్ర భళీ! యటంచు, మె
త్తురు ప్రజలెల్లరర్థముల
తో బని కొంచమెయుండునైన నీ
హరికథ నన్నిటన్ దగిన
యట్టిదయయ్యె ముఖంబు జెందుచున్.



2. అవధాన శిరోమణి సకలకళావిచక్షణ శ్రీ కాశీ కృష్ణా చారిగారు, గుంటూరు.

క॥ శ్రీశుని పెండిలి హరికథ
పేశలమైనట్టి నీ కవిత్వ బలమునన్
జేసి మనశ్శ్రవణ సుధా
పాశనమై వెలుగు సుకవిభూషణధాత్రిన్.

---

3. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠాధిపతి శ్రీమతి విద్వత్కవితిలక, కవితావిశారద కాంచనపల్లి కనకాంబ గారు, విజయవాడ.

క॥ హరికథ భాగవతంబగు
హరికథ రామాయణంబ హా: భారతమున్
హరికథ మురువుగ బలికెను
తిరుమల శ్రీశ్రీనివాస దివ్యచరితమున్.

క॥ నేమాన వంశ జలనిధి
సోముడు కోటీశశర్మ సూరులు మెచ్చం
గా, మారమణుని చరితం
బీమహి రచియించి గాంచె నీప్సితమెల్లన్.

క॥ సంగీతము సాహిత్యము
నుం గవితయు దత్త్వమును నిమంగూడుచు నీ

కుం గీర్తి తెలుంగులలో
నం గూర్చుత దేవికృపఘు : నంబుగ పుత్రా :



## కవిత్రయమునకు నా యభివాద పద్యములు.



క॥ కవిసార్వభౌముడను నీ
యవనిలో శ్రీపాదకృష్ణ యవనీ సురుడు౯
కవనము పూర్ణముగా విని
నవనీతంబనుచు బల్కెనా హరికథనున్.

క॥ శ్రీ కాశీకృష్ణునకు౯
నే కైవారము లొనర్ప నెంచిహరికథ౯
పాకొనగ నంత నాతడు
చేకొని యాశీస్సు నాకు జేసెను దయతో౯.

క॥ శ్రీమతి విద్వత్కవితిల
కామణి శ్రీకాంచనపల్లి కనకాంబ సతీ
నా మనవి సముచితంబని
నీ మహాత్మ్యం బరయుచెంతో నిజధర్మముగా.

క॥ నిర్మల చిత్తముతోడుత
నర్మిలి బరికించి దీని నచ్చొత్తింపన్

ధర్మంబని బల్కుచు తా
శర్మదమగు మార్పులెల్ల సమకూర్చెనహా.

క॥ సేమాన వంశజలనిధి
సోముడు శ్రీ సుబ్బరాయ సుజనునిసుతుడ౯
శ్రీమతి నరసాంబాసుతు
డీమహినిను గొల్పు కోటి యీశ్వరశర్మ౯.



శ్రీరస్తు.

# శ్రీనివాస కల్యాణము.

## (హరికథ)

కవిరత్న సేమాన వేంకటకోటీశ్వరశర్మ.

ఇష్టదేవతా ప్రార్థన.

క॥ గణపతి నీ పాదములకు
ప్రణతుల గావింతునయ్య ప్రమద గణపతీ!
ఫణిభూషణు సుతుడవు నో
గణనాథా! విఘ్నములను గావింపకుమా.

హంసధ్వని—రూపకతాళము

ప॥ గణపతి నీపాద-కమలములకు నే
ప్రణతులజేసెద-ప్రమద గణనాయక

అ॥ సతతము పూజలు-సలుపుచును నీ
కతిప్రీతివంతపు-కజ్జికాయలున్.

చ॥ ఉండ్రాళ్ళను పాయసమును
దండిగ కుడుములు మొదలగు
పండ్లను పత్రిని గొని నిన్
నిండుగ పూజలు సలిపెద.

## సరస్వతీ ప్రార్థన.

మాయామాళవగౌళ—రూపకతాళము

ప॥ తల్లి భారతీ! ననుసదాదయాన్మదానబ్రోవు ॥త॥

అ॥ తల్లీ! నా యుల్లమందు నిలచి నీ
వెల్లవిద్యలెల్ల గఱపు ॥త॥

చ॥ ముల్లోకములేలు నీముద్దుపదము జూపవే
యుల్లము రంజిల్లజేసి యూహాగాన మీయవే
కల్లలేలనే? తల్లీ! మహాంకాళి సీతాది బిరుదుగల్లు ॥త॥

వ॥ కృతిపతి శ్రీనివాసమూర్తియే గనుక:—

ఉ॥ శ్రీలలనామణిన్ హృదయసీమకు మేలిమి కౌస్తుభంబుగా
మేలుగదాల్చి ప్రీతి నలమేలుమఁగూడను బెండ్లియాడ, తా
జాలగ పెండ్లిపెద్దలతొ సంతసముప్పతిలంగబోయి, యా
భూలలనన్ వియత్పురిలొ బొందిన దేవునిగొల్తునెమ్మదిన్॥

తోహరా—భైరవి

నైమిశారణ్యమందు దపములన్-ననయముజేసెడి మునులన్
జూచి సూతుడల శౌనకునకు-దాచోద్యంబగు కథదెల్పెన్
పరమేశ్వరుడలవేంకటేశ్వరుఁడు-పద్మపాణిగ్రహియించెన్
యనుచు బల్లానమ్మునులు కథాక్రమ-మంతయు జెప్పగవేడెన్॥

తే॥గీ॥ అపుడు సూతుడు మోక్షతత్వార్థజ్ఞుండు
ఇహపరంబుల కాధారమిడెడు నట్టి

శ్రీనివాసుడు పెండిలిజేసికొనుట
వీనులకు విందుగాగ విన్పించె నిట్లు.

## శ్రీ వేంకటాచల క్షేత్రవర్ణన.

తోహర—ధన్యాసి.

ధరణి తీర్థముల కాలవాలమౌ దక్షిణభారతమందున్
దివ్యక్షేత్రమై వెలసె నొక్కటిగ తిరుమలయే యనెనంతన్
పాపపుణ్యముల పారదోలి మరి పరమపదమునందరికిన్
జూపగల్గు నాపర్వతరాజము చోద్యంబుగ గలియందున్
ఏడుకొండలుగ వెలసె నద్దానిపేరు శేషగిరి యయ్యేన్
ఏడుగడగ శ్రీవేంకటేశుండు నెల్ల, వరము లిడుచుండున్
కలియుగమున మన పాతకంబులను గడతేర్పగ జనియించెన్
కలియుగ వైకుంఠేశుడందఱకు, కనబడి వరముల నొసగున్.

వ॥ ఆ గిరిరాజ మెట్టిదనిన :—

తే॥గీ॥ కడగి పాతక చయములుగాల్చు కతన
పుడమి మందార తరువయి పుట్టుకతన
వెంకటాచల నామంబు వెలసె నదియు
యాలవాలంబు క్షేత్రంబు లన్నిటికిని.

నవరోజు—రూపకతాళము

ప॥ దానిమహిమ గొప్పదనము-తరమా వర్ణింపగ ॥నద్దా॥
అ॥ దానిపేరు జెప్పినంత, దరియగరా వఘముల్లెల్ల

మి॥ యింపగు పుష్కరిణులతో-సొంపగు పూదోటల, వ
ర్ణింప దరముగానిగోపు-రంపు శోభనరయగ. ॥నద్దా॥

శ్లో॥ 'వేం' పాపసంహారతిప్రోక్తా 'కట' స్తద్దాహతోయతః ॥

చ॥ "కటములు" జేవురింపఁ దెలికన్నులవాడుదయింపఁ బాద, సం
ఘటననలంగఁ గోరికలు గాంచెదమంచును, తీర్థయాత్రకై
యిటునటు లేగనేల ? నరులెట్టి యఘాత్మకులైనఁ గల్గు. "వేం
కట" మనుపేరు జిహ్వాతుదిఁ గాపురముండిన, ముక్తిసంపదల్.

వ॥ ఆపర్వతము నందొక, కాసారంబుగలదు. దానికి స్వామి
పుష్కరిణి యను నామధేయంబు గలదు.



క॥ ఆ సామిపుష్కరిణి యను
కాసారములోన గొప్పఁ గంగాది నదుల్
వాసంబుజేయు మునిగిన
నోసంబులు మాయమౌను దోడ్తోడ నటన్.



వ॥ ఇంకనూ యీ పర్వతరాజంబున 108 తీర్థంబులు గలవు :—

సీ॥ దివ్యస్థలంబైన-తిరుమల క్షేత్రంబు
గొప్పతీర్థంబుల కొండ యుద్ది
యవిరళ కాంతితో నవి నూటయెనిమిది
వానిలో నాలుగు భవహరములు
గోగర్భమందున-కోరిస్నానము చేయ
కోటి యజ్ఞఫలంబు గూడనొదవు
ఆకాశగంగ యందతి భక్తితో స్నాన

మాచరించిన గల్గు యమరపదవి
పాపవినాశని భాగీరథియు బోలి
పాపజాలంబుల రూపుమాపు
వైకుంఠధారను బరగి స్నానముచేయ
అరచేత వైకుంఠమబ్బు మనకు

తే॥ గీ॥ భవ్య వనమూలికల ప్రభావమ్ముచేత
శ్రేష్ఠతరమైన తీర్థాలచెంత ఋషులు
తపములంజేసి శుభముల దప్పకుండ
నిచ్చుచుందురు భక్తుల యిచ్ఛదీర.

వ॥ అట్టి తీర్థాలయందును బంగారుకొలనుగ బరగు స్వామిపుష్కరిణి యందును స్నానమాచరించి, ఊర్ధ్వపుండ్రంబు ధరించి శుచి భూతాంతరంగులై శ్రీస్వామిని సేవించినవారికి సక లైశ్వర్య ప్రదంబగునని వచించి, కథాక్రమంబు జెప్పదొడగెనంత.

మోహనా—తోడిరాగము

పరమ పవిత్రమై బరగుచుండు నబ్బదరికావనమునందున్
వరతపోధనులు జన్నముసేయగ పరతెంచిరి వారంతన్
కలహాశనుడల నారదుండవుడు కారణమరయగ నంతన్
జలజాక్షుని పదవర్ణనచేయుచు జనుదెంచెను తానంతన్
మునులు యర్ఘ్యపాద్యాదులొసగినన్ ముదమున జేకొనెనంతన్
ఘనమగు యధ్వర ఫలమునిత్తురే ఘనునకంచు ప్రశ్నించెన్
మునివరులాశ్చర్యంబుగ తమతమ ముఖములు జూచుకొనంగన్

యంత నారదుడు యాదరమున భృగునంతజూపి యిటులన్
సంతసమున నీకార్యము సల్పెడు శక్తుండాతండనుచున్
పంతముతో తన కలహబీజమటు పారవైచి జనెనంతన్.

వ॥ అంత నత్తపోధనులచే ప్రేరేపింపబడి యజ్ఞఫల గ్రహీతనయ గోరి,

సీ॥ పృథ్వీసురేశుండు భృగుముని యంతట
బ్రహ్మలోకముజేరి ప్రస్తుతింప
ఆలోకమున బ్రహ్మ భూలోకమునకున్నై
జీవరాసుల సృష్టిజేయుచుండె
ధాత ప్రసన్నత తా బడయనేరక
శివలోకమునకేగె శీఘ్రముగను
శూలి పార్వతితోడ సురతాదిభోగముల్
సలుపుచునుండె నా సమయమందు

తే॥ గీ॥ నేడి తెరవంచు వైకుంఠ మేగనంత
పద్మ గర్భుడు లక్ష్మితో పాన్పుపైన
పవ్వళించుటచూచి తా పట్టరాని
కోపమున దన్నె వక్షంబు కొంచకతడు.

వ॥ అంత నా యాపద్బాంధవుండగు నారాయణుండు లేచి ప్రీతితో, నాతని పాదంబులు పట్టి,

కేదారగౌళ — మిశ్రచాపు

ప॥ మునివర నీ చరణములను గనజాలితి నాహా ఓ ॥మును॥

అ॥ ఘనఘాతముచే నక్కట-కమలినదేమో చూపుము ॥ము॥

చ॥ అడవులలో కడునిడుమలు గుడుచుచు నుండుట గానక
జడునివలెన్ నిద్రించితి క్షమియింపగ వేడెదనో ॥ము॥

గీ॥ కఠినతరమైననాదు వక్షంబుతాకి
కమలినది యేమొ మీ పాదకమల మకట
తెందు యెత్తెద పాదంబు దేవదేవ?
పాపరహితంబుగానోపు తాపసేంద్ర.

వ॥ వారిజాక్ష డట్లుగా బ్రతిమాలుచు.

క॥ కాలను గలిగిన గన్నున్
శ్రీలలనావిభుడుపట్టి చిదిమిన నంతన్
కాలాగ్నిబోలు భృగుముని
వ్రాలెన్ శ్రీ విష్ణుపాద వనరుహమందున్.

వ॥ వారిజాక్షుడట్లు బ్రతిమాలుచుండుటగాంచి లక్ష్మీదేవి దిగ్గున వక్షస్థలంబునుండి లేచి, యిట్లతిక్రాంత మర్యాదతో తన వక్షస్థలమును తన్నిన ఋషిని బుజ్జగించుటయు తనను పరామర్శ మైనంజేయ నొల్లని ప్రాణవిభుంగనుంగొని,

గీ॥ ఇట్లు తన ప్రాణవిభుడఖిలాత్మసాక్షి
నిరసనము జూపెనంచు నివ్వెరనుబొంది
మిగుల కన్నీరు కెంగోటమీటుకొనుచు
ననియె నా లక్ష్మిదగ్గుత్తికను జెలంగి.

మధ్యమావతి—త్రిశ్రగతి

ప॥ జాలిగాదె వనమాలి-కాలితాకున కమలెనయ్యో ॥జా॥

అ॥ పాలికాఖిల భువనమోహను-డేలకోనను మరచి
యీవిధి-తూలనాడినతులువ పదములు-తాలి
మిన్ గ్రహియించె నయ్యో ॥జా॥

చ॥ చెల్లరె బ్రహ్మాదులైన చేముట్టగరాని హరిని
తెల్లమితని పుణ్యమేమొ-తిమిరి కాలదన్నె నేడు ॥జా॥

తౌహరా—ధన్యాసి

అనుచు నా దేవి వైకుంఠమువిడి-యంతర్హితయైనంతన్
కనులనాపరాని నీరుగార్చుచున్-గలవరపడె హరియంతన్
కాలమాసన్నమైనదంచు-కలికాలం బొదవెనటంచున్
జాలబాధపడు భక్తులబ్రోవగ-జలజాక్షుడు తానెంచెన్
పూతచరితయౌ భూప్రదేశముకు పురుషోత్తముడేతేరన్
పూలవాన గురిపించెనా వారలు. భూప్రదేశమంతంతన్.

క॥ శ్రీకాంతు డంత భువిలో
నేకాంతముగా చరింప నేడుగిరులపైన్
లోకాంతమైనవరకును
భూకాంతునిబోలియేల బూనగనెంచెన్.

వ॥ అంత లోకమందంతటను,

క॥ కలిలో భక్తుల గావం
గలిగెడు వాడొకటంచు-గంటారవముల్

సలలితముగ మ్రోగెనటఁ

కలివెంకటపతియెగాక-గాన మితరులన్.

వ॥ "కలౌ వేంకటనాయకః" అనునట్లు భూమిపై నవతి
ంచెను. శ్రీలోలుండంత లక్ష్మి యెడబాటువలన చింతాక్రాంతుడై
అదృశ్యుండగుచు ఫలాదులైనం భక్షింపనొల్లక, శేషాచలము
సందొక పుట్టయందు ప్రవేశించి కాలము గడుపుచున్నంత.

క॥ దేవాది దేవుకొరకై
దేవతలకు పెద్ద బ్రహ్మదేవుండిలలో
యావుగనుమారి చేరెను
శ్రీవరునాకలియు బాపి-చింతను తీర్పన్.

వ॥ బ్రహ్మ తాను యావుగను, శివుని దూడగను యొనర్చి
యాప్రదేశమందు ప్రవేశించినతోడనే, తనతల్లికి వార్త నెరిగించి
యామహాలక్ష్మిని ప్రార్థించి ఆమెవల్ల తాను కడుప్రశస్తమగు కపిల
గోవుగ నెంచబడి, యాప్రదేశమును వేలుచుండు చోళభూపతికి
యమ్మబడి వారిగోవులతో ప్రతిదినమును శేషాచలపర్వతమునకు:—

తొహరా—దన్యాసి

మందలయందే నందడిదెలియని చందముతో గలియుచును
పెందలకడ నామందతోడ గోవిందుజూడ నేతెంచుచును
పూరించిన తన పొదుగులపాలను పుట్టయందు విడువంగన్
కూరిమితోడుతనారగించె నాగూఢచారి తానంతన్
కపిలగోవు పాల్కడురుచ్యములని యపుడు వాని కొనియాడి

గోపాలుర నాపాలుదెమ్మనెను భూపాలుడు సతిగూడి
పాలబిడుకుటకు గొల్లలంతటను పరతెంచిన వారంతన్
పాలులేవనుచు పొదుగుల నాభూపాలున కెరిఁగింపంగన్
కాలునివలె నాచోళభూపతియు చాలకినిసితానంతన్
పిలుజూచి యా వింతనంతయును విచువక జూడుడనంగన్.

వ॥ అంతట నా గోపాలుడు నుదయంబుననే లేచి.

సీ॥ గోవుల వెనువెంట గోపాలకుడుపోయి
గోప్యంబుగానుండి కొండప్రక్క
ఆ యావు జాడలన్నరయుచునున్నంత
పొదుగును పూరించి పుట్టజేరి
పాలను ధారగాపారింపుదుండగ
పరతెంచిగోపడు పట్టరాని
కోపంబుతో నావుగొట్టబోవగ నంత
పరశునకడ్డుగా పరమపురుష

తే॥గీ॥ డేగుదెంచిన శిరమునకేగి తాక
యాపదనుబాపవచ్చిన యాదిదేవు
డాపదనుబొంది శిరమున నోపరాని
బాధతాళక పుట్టలో పవ్వళించె.

లొహరా—ధన్యాసి

అప్పుడప్రబముగ గోపఘాతకుని యతులుమిర్కిల్లు పృవన్
ఆప్పున భయమున నసువుఁలబాయుచునప్పుడె నేలసుకాలన్

గో. గోపకులరాకకెదుర్చూచు-గోపకాంతలావింతన్
వేగదెల్వ నా చోళభూపతియు వెళ్ళిచూచె నావంతన్.

వ॥ ఆ రాజుకన్నులు మిరుమిట్లు గొలుపునట్లుగ శ్రీ వేంక టేశ్వరుడాపుట్టనుండి సర్పంబువలె కోపముతో దర్శనమిచ్చి ఆ రాజును నొకభూతమయి దేశమెల్లెడల ద్రిమ్మరుమని శపింప, అంత నాతడు శ్రీవారికి ప్రణమిల్లి, శాపముపోవుమార్గమును నను గ్రహింపుడనివేడ తా నాకాశరాజుపుత్రి పద్మావతిని బెండ్లియాడు సమయంబున, నారాజుచే బహూకరింపబడు బంగారుకిరీటము ధరించుచో తనకా తలబాధయు, రాజునకాశాపవిమోచనము గలుగు ననిచెప్పి, శిలవిూసంగెనంత, శ్రీనివాసమూర్తి.

క॥ మీరని బాధలు తొలగగ
నారాయణుదలచి వారినామ భజనమున్
నోరారనలుపు వకుళమ
చేరువకునుబోవ తనకు-సేవలజేసెన్.

వ॥ అంతట.

క॥ మోచమునుగూర్చి భక్తుల
బాధలదొలగింపజేయు పరమాత్ముడు దా
వేదనతో బడియుండిన
శ్రీధరు బాధలనుబాపె చేడియ యంతన్.

తోహరా—మోహన

అంత నారాయణుండామెను తల్లిగ నెంతయు ప్రీతిబొందాతన్

సంతతమామెయు సేవజేయుచును చింతను బాపగనంతన్
కొంత కాలమాకోనవాసముగ కోరుచు నారాయణుడున్
వింతగవేటలజేయబూనె శ్రీకాంతను మరువగనంతన్.

వ॥ ఇట్లఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన. శ్రీని వాసమూర్తి సుఖముగ కాలముగడుపుచున్నంత, నారాయణవసం బను మహారణ్యంబులలో వేటకై దిరుగుచుండునపుడు,

బిలహరి—రూపకము

ప॥ ఆ కాననమధిపతియొక-యాకాశారాజవరుడు,

అ॥ భూకాంతుని ధర్మపత్ని-భూదేవితో నేలుచుండె ॥ఆ॥

చ॥ లోకక్షేమముకొరకై-చేకొని జన్మముచేయగ
యా కాననమున రమ్యపు-టేకాంతస్థలముజూచె ॥ఆ॥

1. భూమిని దున్నుచునుండగ-పూతచరిత పద్మావతి
భూమీశుని కంటబడిన-పులకరించె తనువదంత

చ॥ శ్రీకాంతుని కృపయనుచును-భూకాంతను రావించుచు
రాకాసుధాకరానను-చేకొని యేగెను నగరికి ॥ఆ॥

వ॥ ఇట్లుగా నాగటిచాలునందు పద్మములో దొరకిన బిడ్డకు పద్మావతియను నామకరణంబుచేసి గారాబంబుగా పెంచుచుండ. నామె శుక్లపక్షపు చంద్రునివలె దినదిన ప్రవర్ధమానయై,

క॥ తల్లిని దండ్రిని పెద్దల
చల్లని చూపులనుజూచు-చనువునదిరుగున్

యుల్లాసమాడు చెలులతో
నెల్లపుడు నీవిష్ణుదలచు-నేకాంతముగా.

తే॥గీ॥ విష్ణునే భర్తగాబొంద వేదవతియు
నిష్టసిద్ధిని బడయుటకీనృపాలు
పుత్రికయ్యెను నంతటపుణ్యవతికి
నూగు నూగెలప్రాయంబు జేగురించె.

తోహరా—కళ్యాణి

ఆటలాడుటకు పద్మావతి యొకతోటలోపలను జేర
చేటియలంతట పాటబాడిరి శ్రీమతి చెవికింపార.

వ॥ ఇట్లుగా తోటయందు చెలులతో విహరించు పద్మావతి
బరయుగోరి నారదమహర్షి హరిధ్యానము చేయుచు,

కేదారగౌళ—మిశ్రచాపు

ప॥ యీకలిలో హరిస్మరణ మొకటియేగాక, యితర
మార్గం మరిలేదయ్యా. ॥క॥

అ॥ మూర్తిత్రయమౌ మూర్తిని గనినన్
కీర్తిగల్గియప కీర్తుయుదొలగును. ॥క॥

వ॥ తోటయందు ప్రవేశించి, పద్మావతిని గనినంతట చెలు
లతో పద్మఋషికి యర్ఘ్యపాద్యములనొసంగి, సుఖాసీనునిజేసిన
పిమ్మట నారదుడు పద్మనుగని,

క॥ మాతవు సర్వజగద్వి
ఖ్యాతవు మధుకైటభారి; ఘనవక్షమునన్
పూతవునతజనరక్షో
పేతవు నీచిన్నిచేయివే జూపగదే.

తోహరా—భైరవి

అనుచు నారదుడు యామె హ స్తమును నరయగ గోరిన నంతన్
అనుగుంజెయిలపుడామె హ స్తమును యాముని కండ్లకుజూపన్
మా చెలి పెండిలిజరుగు నెన్నడో మహనీయ వేగదెలుపన్
వేడెదమనుచును-చేడియలంతట గూడు కొనిలువగ నంతన్.

వ॥ అశ్లేయగుగాక యనీ, పద్మావతి కరమును గని యామెకు వివాహమచిరకాలములో జరుగగలదు. పెండ్లికొడుకు కలియుగయవతారమూర్తి, కలిపురుషుడు కామక్రోదాదిషడ్వర్గసమేతుడై యధర్మము నాల్గుపాదములనడిపించి భక్తులకు బాధల నొసరించి పీడించుచుండ, ఆనాడా హిరణ్యకశ్యపు సంహారముకొరకు ఏయేగతుల యవతరించెనో అట్లు అందరికడనన్ని మూర్తులుగా యవతరించి కలిబాధలగ్రాగు భక్తులగావ కంకణముగట్టి యవతరించిన యాదిదేవుడు.

సీ॥ ఏడుకొండలగద్దె నెక్కిలోకాల బా
గోగుల పరికించు కొండరాజు
ఆపదమొక్కులనన్ని లెక్కలకు; కొ
ప్పెరజావితాగల పెద్దశెట్టి

కులముపాటింపక కొసరి బూబును పెండ్లి
సలుపు కున్నట్టి యా సాయబయ్యె
తనకడకేగు వారినిబోడిచేసి, సం
పదలాచి తోనియెడు మాంత్రికుండు.

తే॥ గీ॥ కలియుగంబున కొండపై కాపురమ్ము
పెట్టి ప్రజలకుద్రోవజూపించుగేస్తు
డతని శుభవిగ్రహము వేంకటాద్రిగద్దె
పైన గనుగొనుచుండు ప్రపంచనడత,

వ॥ శ్రీనివాస, బాలాజీ, వేంకటేశ్వర ఏడుకొండలవాడు అను నామంబులుదాల్చి యవతరించియున్నాడు, త్వరలోవచ్చి పాణిగ్రహణము చేయగలడనిచెప్పి వెడలెనంత.

తోహర — మోహన

రంతులు వేయుచు చామంతులతోబంతి యాటలను యాడ
వింతద నావిరిబంతిపోయి శ్రీకాంతుని చెంతకుజేర
వేటలాడు శ్రీ వేంకటేశ్వరుడు వింతగ నావిరిబంతి
తోటలోని యాజవ్వనులనుగని, సూటిగ విసరగ నంత
చేటియొక్కతకు తాకి యా బంతి తూటువారెకా నంత
మోటసరసమంచెంచి కోపమున కోటజేరజనిరంత
చాటుగ పూపొదరింట దాగియా వేటకాని సుందరము
నీటుగ శ్రీ పద్మావతిగనెనట వేటసల్పు శ్రీకాంతుడా:

వ॥ అంత నామెకు శ్రీహరి తన కృష్ణావతారరూపమున దర్శనమీయ స్తుతించెనంత.

సీ॥ సిగను పింఛమువాడు తొగలసంగడికాని
పగలుగుఱ్ఱడు ముద్దుమొగమువాడు
సొగసుకురులవాడు సొగసులమొనగాడు
పిడికిట నిముడునెన్నడుమువాడు
శ్రీకారములబోలు చెవిదోయిగలవాడు
గురుసానరీతి పేరురమువాడు
కోమటు ప్రాయమువాడు గుమురు నీలపురాల
కోమరు నెమ్మెయిబాయ లమరువాడు.

తే॥ గీ॥ నొసట కస్తురినామంబు పొసగువాడు
కరములను మురళివాయించ గలుగువాడు
డంబు మీరిన మణికరీటంబువాడు
వెడినంతనె తోడుగా గూడువాడు.

వ॥ అని యిట్లుస్తుతించుచు నగరునకేతెంచి.

తే॥ గీ॥ అతుల జవరాలిపద్మయయ్యలరు మేడ
లోన తూలికపాన్పుపై మేనువైచి
తాను జూచిన యువకునిదలచు కొనుచు
గడియ యొక యుగముగను దాగడుపుచుండె.

వ॥ మదన తాపాయత్త చిత్తయౌ నా పద్మావతిని విచారించుటకై చెలులు జేరజని చింతవింతమాటలచే నవ్వించు ప్రయ

త్నించినను చింతబాయదయ్యె అంత నొక యింతి యీ వసంత
కాలమెంత మనోహరముగనున్నదో చూచితివా.

క॥ వనమున కోయిల పాడగ
ఘనముగ వెన్నెలయు చల్లగాలియు విసరన్
మనసిజుడు మారుమూలల
తనకుసుమాస్త్రములతోడ దద్దయునొవ్వన్.

తౌహార—ధన్యాసి

అటుల వసంతుని వర్ణనజేసెడు యతివమాట వినినంత
కటకటపడి యా పద్మావతితా కలవరపడెలా వంత

వ॥ అంత కొంతసేపటికి పద్మావతి చేతకి నెన్నరబట్టి
నా వసంతుని చెలికాడగు మన్మథుని దలంచి.

హిందుస్థానీకాఫీ—త్రిశగతి

ప॥ భావజ భామల బాములబెట్టగ బాడియె నీకిది పౌరుషమే।
అ॥ ఈవిధినారులగారియబెట్టగనేమిఫలంబునుగూడునొకో॥భా॥
చ॥ శ్రీవరపుత్రుడవయ్యును నిట్టిదిచేసిన లోకులు ఛీయనరే
దైవశిరోమణిశూలియొనర్చినదండననీమదినాటదొకో॥భా॥

వ॥ అటుల పాడుచు చైతన్యముతప్పిపడియున్న నంత
చెలులు శీతలోపచారములు చేయుచు, ఈ సంగతి భూదేవికెరిం
గించిన, నామె చింతాక్రాంతయై తనబిడ్డకేమికష్టము కల్గెనోయని
చింతించుచు రాజుగారికి తెలిపి వైద్యులను మాంత్రికులను రావించి

గ్రహశాంతులు మొదలగునవి చేయించుచుండునంత శ్రీనివాసుడు పద్మావతిని తోటలో చూచినదిమొదలు ఆమె యందనురాగముగల వాడై తనకు గల్గిన యవమానమును గూడ పాటింపక పద్మావతీ పాణిగ్రహణ కుతూహలుండై.

జంఝూటి—మిశ్రచాపు

ప॥ ఏందమా! యిటు కుందనేల కడింది తాపము వీడుమా

అ॥ ఇందిరాత్మజునిట్లు నన్నలరించవద్దని వేడుమా

చ॥ అల్లభూమిజతోడ గూడి సుఖాబ్ధినీదగ శక్యమా
బల్లిదుండగు బ్రహ్మవ్రాసిన వ్రాతతప్పునె చెప్పుమా
చెల్లబోకద లేనికోర్కెలు చెల్లబోవిక మానుమా ॥ఏం॥

తోహరా—ధన్యాసి

అని తనమనమున పద్మను దలచుచు యాహారముగొనకున్నసే
చనువున వకుళమ యడిగెనంత నాపారసాక్షినావంతన్
తన మనసెరిగిన తల్లితోడ నవ్వనజాక్షిని గొనియాడెన్
మనమున నాశయుసందియమును బెనగొన శ్రీహరివగబెంచెస్.

గీ॥ ఇటుల శ్రీహరి వకుళకు నింతిసొబగు
చెప్పుచును నంత సంతోషముప్పతిలగ
పరిణయముజేయ మనగ నాపరమపురుషు
తోడ సంతసమున బల్కెతోయజాక్షి.

శ్రీరాగము—ఖండచాపు

ప॥ ఏలా నీవిటు చిన్నబోవుటిది యేలాగుణశీలా యీవేళా

అ॥ మేలుగ జగదీశ నీకునే నిల్లాలిగూర్ప నెంతధన్యురాల॥గో॥

చ॥ తానిమిజెందుము, నీకాతలిరుబోడి గూర్చి నీమది,
జాలిదొలగబెండ్లియచిర కాలములోజరిపెద ॥గో॥

క॥ అటు పల్కి వకుళ యంతట
పటు తరసందేశవార్త పారగంతయై
చిటవుగ సర్దగ శ్రీహరి
మటు మాయలనవ్వు నవ్వి : మాటాడె నిటుల్.

తే॥ గీ॥ తల్లితో నేను కోరిన తలిరుబోడి
యీమెయే వేదవతికన్య యిదియె సీత
కొరకు రావణుబాధల క్రుంగెనకట
యీమె యాకాశరాజున కనుగుబిడ్డ
గనుక నీపద్మకరమును గొనుటవిధియె.

తే॥ గీ॥ ద్వాపరంబున నేకృష్ణు తల్లివీవు
వరయశోదవు కళ్యాణమరయనేర
ననెడు గోర్కెను దీర్చెదజనని కలిలొ
వరద వేంకటునేనైతి వకుళవీవు.

క॥ అమ్మా : నీవాకొమ్మను
నెమ్మెయినను గూర్పకున్న నేజీవింపన్.

హెమ్మిక తడయగ నేటికి
సమ్మతముగ వేగదాని సమకూర్చగదే!.

వ॥ ఆవిధముగ తల్లివద్ద బిడ్డడుబోలి ముద్దులు గులుకుచు.

తోహర—ధన్యాసి

అని తనయాశయ మెరుకపరచి యాయతిభను శ్రీహరి బంపెన్
జననికి ముందుగ పైన మాయెనా జలజాక్షుడు తానంతన్
చేతిబిడ్డగా పద్మాసనునిన్ చేలాంచలమునుగట్టి
ప్రీతితోడ తానెరుకరూపమును ఖ్యాతిమీరధరియించి
ఆకాశపురమునంతట జేరుకొ లోకేశ్వరుడంతన్
శ్రీకరమగు తనపాదముబెట్టెను శ్రీకాంతుడు తానంతన్
కేకవేసి యా భూకాంతనుగని వీక జూపలావంతన్
మూకొన జొచ్చిరి సోదెనెరుగుటకు మూలనున్నవారంతన్

వ॥ అంత నాయెరుక రూపముననున్న శ్రీనివాసుడు పల్కినస
దేమనగా

సావేరి—మిశ్రచాపు

ప॥ సోదెజెప్పినదో-సోదరిమణులారా! ॥సో॥

అ॥ వేదనబడియెదు-వెలదులకందరకు ॥సో॥

చ॥ బాధపోయెను వేగ-పరమాత్మదయవల్ల
మోదముతో నాదు- సోదెనెరుగరమ్మా

బీదవారలకైన-ప్రియము గొల్పెడ సోదె
వాదులాడక నేడు వచ్చిచూపరెచేయి

వ॥ అంత కాంతాజనంబు లతఃపురంబునకేగి ధరాదేవికి వింత దెలిగించిన యామె యెరుకతెనురావించి వాటయందు ముత్యములు తాంబూలమునుయునిచి సోదెచెప్పుమని ప్రార్థింప నప్పరమేశ్వరుడు.

క॥ మీరాకొమరిత వలచెను
రారాజును తోటలోన లక్ష్మీకాంతుడా
డారాజుగూడ నీమెను
జేరగనేతెంచునమ్మచెప్పరనిటకుడా.

వ॥ అదియును గాక.

క॥ మారాకారునకీ మెకు
కోరిన దాంపత్యమమ్మ కోమలివినునా
నేరమని చెప్పబోకుము
చీరుచుదోడ్తోడబెండ్లి జేయవెసఖియా.

వ॥ అట్లుగాజేయనిచో నీమె మూడుదినంబులలో గతించగలదనిన వారందుకు చింతనొంది. యారాకొమరుడెంచున్నవాడు. ఆయన నెట్లుదెచ్చుట యని ప్రశ్నింప శ్రీహరివారితో.

తోహర—కల్యాణి

నేబోయిన నావెనువెంటనె యొకనెలత మీగృహంబునకొచ్చుగా
కాబోయెడు మీ పెండ్లికొమరుకా కాంతమాత యుపపింపగా

అమ్మ నామాట లిచ్చుకములుగావమ్మ ధరాదేవమ్మా
నమ్మకము నేతు నామెగూడ యీ నాడువచ్చు గుణమాన్యా.

తే॥ గీ॥ యనుచుబల్కగ నాదేవియతి ముదమున
సారెచీరలు నగలును జాలదెచ్చి
జేరగాబోవనంత నాచేటిమిన్న
మాయమాయెను భూకాంతు మందిరమున.

వ॥ అంత భూకాంతుడు మొదలుగాగల యతఃపురజనం
లాశ్చర్యంబున దిగులొంది చూచుండ రాజనగరునయంత ర్హితయైన
శ్రీహరిదారియందు వకుళాదేవికి దర్శనమిచ్చి.

క॥ కోరిన వరములవిచ్చెను
మారమణుడు వరముబడసి మరిరమ్మనుచున్
కూరిమి తల్లికిచెప్పుచు
జేరెను తననిజనివాస సీమకునంతన్.

వ॥ వకుళాదేవి సంతసమంది యాకాశరాజనగరునకేతెంచి:

క॥ అచ్చపుటష్టాక్షరజప
ముచ్చారణ సలుపుచుండి యుర్వీసునితో
ముచ్చటలాడుచు నగరును
జొచ్చిన కాంతాజనంబు చోద్యమునొందెన్

తోహర—మోహన

ఘోరిసంతోషమొదవ నాచెలులు భూకాంతునిగని రంతన్
చేరువనుండిన పద్మావతితో చెప్పిరి యాశుభవార్తన్

అంతనారాజుకాంతను గూడుకొనింతి చూడనేతేరగ
చింతను దీర్చెడు చిగురుబోడికిగ సంతోషముతో మ్రొక్కెగ
అర్ఘ్యపాద్యములనన్ని యిచ్చి యాయతియను కుశలంబడుగగ
దీర్ఘాయువని రాజదంపతుల దీవించెనుతానంతగ.

వ॥ వకుళాదేవిని యాసనంబున నధిష్ఠింపజేసి కర్పూరమిశ్రిత తాంబూలంబులొసంగికుశలంబడిగి విశేషంబులుచెప్పుమనగానామె.

మధ్యమావతి—మిశ్రచాపు

ప॥ ఈ రాకొమరిత కిష్టమైన వరుడీకాననమునగలడు
మారాకొరుడు మర్త్యలోకమున మనలగావనున్నాడు

అ॥ ఇహపరసుఖముల నీప్సితార్థముల, నిచ్చుటకై జనియించె
మహానీయుండామారు బాధతోమన జాలకకృశియించె
పూతచరిత యా పద్మాలయను పూనియేలెకొన్నాక్లి
ఖ్యాతిగ నీకలికాలముగావగ యేతెంచెను భగవాన్లు
ప్రీతితోడ మీ బిడ్డనడుగ నన్నితీరున బొమ్మనియె
కూతురనిచ్చిన కులముతరింపగ,జేతుననుచు వాకొనియె

వ॥ అంత నాయాకాశరాజు వకుళావళితో

క॥ ఖ్యాతిగల విష్ణుపదముల
జేతులగడుగుచును బెండ్లి జేసెదననుచుగ
ప్రీతిగ బల్కుచు వకుళను
యేతేరండనిన యామె-యెకిమీడునకుగ

వ॥ ఓరాజా ! నేబోయి సర్వసన్నాహములొనరించుకొని తర్లి రాగలమని చెప్పి వెడలిపోయెను. అంత నాయాకాశరాజు శ్రీశుకుని బృహస్పతినిరావించి.

చౌహర—కల్యాణి

శ్రీనివాసునకు లేఖపంపుటకు శ్రీ శుకునింబిలిపించి
పెండ్లిపత్రికలు వ్రాసిరంతటను పెద్దలసముఖముసుంచి

తే॥ గీ॥ పరగవైశాఖమున శుక్లపక్షదశమి
శుక్రవారమునందునా సుతను నీకు
పెండ్లిజేయగ నెంచిరి పెద్దలంత
శీఘ్రముగతర్లిరావయ్య శ్రీనివాస

చౌహర—మోహన

అని శుభలేకను విష్ణునకిమ్మనియా శుకునుంబనిచి
మనమున శ్రీహరినామంబనిశము మననముజేయగనెంచి.

వ॥ అచ్చట వకుళావళిరాకకెదురుచూచుచున్న శ్రీహరి

క॥ ప్రీతిగ శుభవార్తను గొని
యేతెరెనో లేదొయింతి యేమిజరిగెనో
చేతను లేదొకగవ్వయు
నేతీరుసబెండ్లియగునొ యేమియుచెప్పుమా !

వ॥ అని యాలోచించుచూ స్వాతివానకు ముత్యపుచిప్ప లెదురు చూచునట్లు వకుళావళిరాక కేదురుచూచుచుండ నంత నామె ప్రవేశించి స్వామికి నమస్కరించి.

మలయమారుతము—ఏకతాళము

ప॥ దేవదేవుడవు నీదు మహిమలను దెలియగలేమురస్వామీ
నీవు పెండ్లికొడుకువౌదు విప్పుడే నీలదేహ శ్రీస్వామీ॥ దే॥

అ॥ ఆదిమద్యాంతరహిత నీ యంతరాత్మ దెలసి, నీదు
చెట్టబట్టనుండెనా నీరజాక్షివలచి ॥ దే॥

క॥ అని కర్ణపర్వముగజె
పినతల్లికి మ్రొక్కెయంత, వేడుకలలరన్
తనువున పులకాంకురములు
మునుకొన శ్రీహరియుబల్కె ముదముప్పొంగన్

క॥ అమ్మా! నాపెండిలినీ
వెమ్మెయి జేయంగదోపు? నేకడుబేదన్
సొమ్ములనెట్టుల గూర్తువె
కొమ్మా! నాపెండ్లిజేసు—కొనుటెటులమ్మా!

వ॥ అని ముద్దుపల్కుల తనవద్దబలుకు శ్రీహరిని మోదామ్బు
సమయంబున శ్రీశుకుండేతెంచి శుభలేఖంగొనివచ్చి.

జకరయాటి—మిశ్రగతి

ప॥ స్వామీ! తేధన్యుడు నీ సాన్నిధ్యము దొరకెనహా ॥స్వా॥

అ॥ నీ మానసమందునున్న భామామణిగూడె నిదిగో

చ॥ చెమ్మ నీ ప్రభనుజూచి నమ్మానిసిగ్రాసె నిదిగో ॥స్వా॥

తోహర — మోహన

అంతనా శుకుండు మంగళసంతోషముతో రాగా
వింతయైన చిరునవ్వున శ్రీహరి-వీనులకు విందుగాగా
పలికె శ్రీశుకుండో సామీ నీ పదతియయ్యెనా పద్మా
జలజాక్షనీవిక యామెను సరగునజేకొన రమ్మా !

వ॥ ఆ యాకాశరాజు తమకు తనపుత్రికారత్నంబైన పద్మావతీ దేవినియిచ్చి పెండ్లి గావింతుననియె. ముహూర్తము దగ్గరయ్యె గావున, నాకు ప్రత్యుత్తరమిచ్చి వేగపంపించ ప్రార్థనయను శ్రీశుకునకు శ్రీనివాసుడు,

తే॥ గీ॥ శ్రీశుకా ! నీవు దెచ్చిన శ్రీముఖంబు
జూడ నామది ప్రేమను జూరగొనియె
పైనమైవచ్చి పద్మను పరిణయంబు
నగుదునను చును వారితో ననగదయ్య.

వ॥ అట్లుగా శ్రీశుకునకు శలవొసంగి.

దోహరా — మోహన

శేషుని శేషాశనుల బిలిపించి చెప్పరవారల కంతట
శేషశాయి తనపద్మాసనునకు—శేషాభరణాదులకున్
వేగబోయి యీ శుభవార్తను వే వేగ దెల్పిరమ్మనగన్
జాగుచేయ కాపురముల కుంజని జలజాసను కెరిగింపన్
దేవతలందరు దేవేశులతో తెల్లవారుసరికంతన్
శ్రీవనజాక్షుని పదపద్మముకడ సిద్ధముగానిలువంగన్

వ॥ దేవలోకాధిపతితో బ్రహ్మాదిరుద్రాదులతో కొంతతడవు ముచ్చటించి కుబేరునిచూచి శ్రీనివాసుడు.

క॥ అనయము పెండిలికై తన
యనుగుంగాతురనునాకు, నర్పించుటకున్
వినయమున లేఖబంపెను
ఘనమగు యాకాశపుత్రికరము గొనంగన్.

క॥ మంగళసూత్రముకైనను
కొంగున గట్టుటకునైన కొరతయెగద, నా
సంగును గూర్పగధనమును
చెంగట జేర్పంగదోయి చెలిధనదుండా !

వ॥ అని లక్ష్మీవల్లభుండడిగిన యా కుబేరుండు ధనమును అప్పుగా నిచ్చుటకే తన కధికారముకలదు గాన నా ధనమును వడ్డీతోచెల్లించవలెననిన అటులనేగానిమ్మనిన యంతబ్రహ్మ.

దోహా—కల్యాణి

పెండ్లిప్రయత్నములన్ని యొనర్పగ—వేల్పులకున్నియుమించి
దండిగ శుభలేఖలనుబంపె నాధాతనాల్గుదిక్కులకున్
అంత వచ్చిరారాజులందరును వింతయైన రధములతో
కాంతిదొలంగుచు శ్రీహరియంతట చింతమునిగెలావంత
వింతదోచి భూకాంతులంత శ్రీకాంతుని చెంతనుజేరి
పంతముతో ప్రశ్నింపదొడంగిన కొంతతడవునకుజెప్పెన్

తే॥ గీ॥ వనితయొక్కతె యైన నావద్దలేదు
పడతి మహాలక్ష్మినన్నెడ బాసిపోయె
స్త్రీజనంబులు లేనిది శ్రీకరంబు
గాదనుచు బల్కుచుందురు గాదెబుధులు.

వ॥ అంత బ్రహ్మమహేశ్వరుడు తమపత్నులను జూపి
పిలుచుండిన జాలుగదాయనిన, వారికి శ్రీహరి.

తే॥ గీ॥ పత్నులనుగల్గి మీరలాపదనుజెందు
నన్ను గేలింత సేయుట కన్న నధిక
మేమివచియింతునో పరమేశులార!
లక్ష్మిలేనిదె పెండ్లికిరాను బొందు.

వ॥ అని నంత లక్ష్మీదేవిని దోడ్తెచ్చుటకు బ్రహ్మ
సూర్యుని నియోగించె నంత శ్రీహరి సూర్యునితో.

సీ॥ పద్మాలయనుబిల్వ, పద్మినీప్రియుగోరి
రావించి తనయంతరాత్మనుడివి
పటుతరశక్తిచే పద్మాలయను బిల్చు
భారంబు నీయదిపోవదూర
వేగదెమ్మనినంత వేడుకతోజూచి
నేరీతి దెప్పుటయేమి చెప్పు
ననుటయు శ్రీహరి యతి ప్రమోదంబున
నీపతియుండెనే నీరజాక్షి.

తే॥ గీ॥ తోడవచ్చినముఖమును జూడగల్గు
దుపురయంబున బోయిన తోడవెడలు
గాన, తడయకబోవయ్య కమలమిత్ర
చింతదీర్చుము లక్ష్మినాచెంతజేర్చి.

వ॥ అదియునుగాక: నా మహిమవలన ఆమెకు నిచ్చటి సంగతులన్నియు నగోచరంబయి నీ మాట వినినంతనే వెడలి వచ్చును. అనిన సూర్యుండు తక్షణము కొల్లాపురముబోయి లక్ష్మీ దేవినిదర్శించి.

బిలహరి—త్రిపుట

ప॥ ఏమని తెల్పుదునె - నీ సామిదౌ్రశమలు తల్లీ
అ॥ శ్యామలాంగుడు నేడుయడపుల - నేమికానున్నాడొ
తెలియదు. ॥ఏ॥

చ॥ కోమలదేహముభువిపై - నేమొ్రవాలవేసిమనల
నేమి కారణమునొగాని - కోమలాంగి సరిజూడడు॥ఏ॥

1. మూడుకోటుల దేవతలుదరి - గూడియుండిరి ధాత
శివులతో - మూగవాడై పలుకరించక - మూర్ఛపోయిన
తనువుతోడుత ॥చ॥ ముందటననుచేసంజ్ఞను చెంతకు
రమ్మని బిలచెను మందయాన నిన్నుజూడడెందముతొం
దరపడెననె. ॥ ఏ ॥

వ॥ అట్లుగాపలికిన సూర్యునివచనంబులువినినంతనె పద్మాక్షి తొందరపడి.

తే॥ గీ॥ సూర్య ! నీతోడవచ్చినా సుందరాంగు
జూడకుండిన ప్రాణముల్వీడునేమొ
త్వరగపయనంబుగావయ్య దరియజేరి
మందులనునైన యిచ్చెదమాధవునకు

తోహరా—ధన్యాసి

సూర్యరధంబునపైనమగుచు మరి - సూటిగ హరితావునకు
ధైర్యముతోడుతవచ్చి చేరెనా దామోదరు జూచుటకు
తిన్నగ భలుకకబడియుండిన యాసన్నుతాంగుదరిజేరి
మన్ననతో తన మనవియొనర్చెను మహాలక్ష్మియుతాకో
చూచుచుండిరా దేవతలందరు.చోద్యమైన హరిమాయ
లేచిమూర్ఛానెను మహాలక్ష్మినితావాచిపోయితనుడాయ.

తే॥ గీ॥ భర్తమనసును యెరిగిన పద్మతన్ను
పిలుచుటకు కారణముగూడ ప్రీతినెరిగి
వరము దీర్పగవచ్చిన తరుణమిదియె
లెండు లెండనుచు బల్కెతాదండిగాను.

వ॥ అని దేవతలందరను హెచ్చరించి శ్రీనివాసకల్యాణ
మును తప్పక నేనేజరిపెదననుచు కళ్యాణగుణసంపన్నునకు నిత్య
కళ్యాణముగదాయని పచ్చతోరణంబులు కట్టనియమించి శ్రీని
వాసుని పెండ్లికుమారునిగా జేయనిశ్చయించి.

కళ్యాణి—రూపకము

ప॥ శ్రీలక్ష్మియెనలుగుబెట్టె - శ్రీధవుపెండిలికంతట

ఆ॥ జాలగపరిమెళద్రవ్య పుజలకమార్చెస్వామికంత

మి॥ భారతి పార్వతిమొదలగు - భారత మహిళామణులట
చేరకొబాడుచు మంగళ - హారతిచ్చిరా స్వామికి॥శ్రీ॥

తొహర—కళ్యాణి

అంత దేవతలు గురిపించిరియట - వింత ప్రసూనధార
చెంతనాట్యములనాడె నాసురలు - శ్రీనివాసుకింపార
జయజయధ్వనులుచెలగ నాసురలు చామరములు వీవగను
దేవదుందుభులు మ్రోగెనల్దిదిశల, మత్తేభమందుహరిజేర

తే॥ గీ॥ వేంకటేశుండు పెండ్లికి వెడలుటయ్యె
దూరమే దూరమై కోర్కెచేరవయ్యె
మదను కోలలకు న్వాడిపదునులయ్యె
మావిఫలముల పై శాఖమాసమయ్యె.

వ॥ బ్రహ్మమొదలుగాగల దేవతలతో అష్టదిక్పాలురతో పరుశావళి శ్రీనివాసునితో లక్ష్మిసమేతంబుగ నాకాశపురంబునకు ...యలువెడలి చేరునంత.

క॥ అంతట నాకాశపురం
బెంతోరమ్యము నొనర్చి యెలమితొమాలల్
చెంతను పందిళ్ళకుతా
వింతగ కట్టించె పెండ్లివీధులలోనన్

వ॥ నిత్యకల్యాణముం బచ్చతోరణంబుగ పురియెల్ల నలంకరించి జయస్థంభంబులందురంగంబుల రధంబులొప్పార కనుప్పల

పంపుగ నొనర్చి. ఆగాశరాజు బంధుమిత్ర సమేతంబుగ భూసురాశీర్వాదంబులతో జయరవంబులతో శ్రీనివాసుని యెదుర్కొని సకల వావివరుసలతో శ్రీలక్ష్మి వకుళావళి మొదలుగాగల స్త్రీ జనంబులనెల్లరను పురంబునంగల విడుదులయందు ప్రవేశింపజేసి పద్మావతికడకు యాకాశరాజుపత్ని సహితంబుగబోయె.

క॥ యుల్లమురం జిల్లువరుఁ
యల్లదెనే దోడితెచ్చి యాసౌధమునఁ
ఎల్లరవిడి యుంచితినో
తల్లీ! నీ పెండ్లిచేతు తడయకలెమ్మా.

తోహరా—మోహన

అనుచు నాకాశరాజుపత్నియున్ యా పద్మనుగొనితెచ్చి
యనుగు పుత్రికన్మంగళ స్నానములాచరింపనియ మించి
చెలులు పూర్ణకలశంబులు చుట్టున్ సేవించుచువెన్నాగా
ఘలుఘల్లను చందెలుమ్రోయగ-కళ్యాణమంటపముకేగ.

తే॥గీ॥ శ్రీనివాసుని రావించి శ్రీకరంపు
పీటపైనమరగంజేసి పీతవస్త్ర
ములనుధరియింపజేసిరా మునిజనంబు
మంగళాశీస్సులంత జలంగబెండ్లి.

శ్రీరాగము—రూపకము

ప॥ శ్రీకరముగ జరిపిరహో!
శ్రీనివాస కళ్యాణము ॥శ్రీ॥

అ॥ నాకనివాసులుకూడు కొ-నయనానందంబుగనట ॥శ్రీ॥

చ॥ ఆకాశరాజుగడిగె నాహరిపదపద్మములను
ప్రాకటముగ పద్మావతి-పాణిగ్రహణముజరిపెను॥శ్రీ॥

వ॥ అంత ఋషులు భూసురులు మంత్రంబులుచ్చరించు చుండ, ఆకాశరాజు ధరాదేవితో కలసి పద్మావతికరము పరమేశ్వ రుని కరమునసిడి.

బిలహరి—రూపకము

ప॥ మాకన్యా బంగారుబొమ్మ మాధవా చెకొమ్మారమ్మా ॥మా॥

అ॥ శేకలేక దొరకినమా-కేకపుత్రిగానదీని

చ॥ నీకై వ్రతములనెన్నియొ చేకొనిమేమాచరించి
లోకైక నిదాన శ్రీశనీకర్పించితి మిదిగో ॥మా॥

వ॥ అంత కొమార్తెనుద్దేశించి,

చ॥ అమ్మా! పద్మావతమ్మ, మమ్మందరియుంపజేయువమ్మా
శ్రీవేంకటేశు-నిమ్మానిసిగాబడయవె ॥అ॥

చ॥ కొమ్మా! నీ కాపురమును నెమ్మదిగా వీరితోడ
సమ్మతముగజేయుచు బుధసమ్మతిబడయగదమ్మా॥అ॥

వ॥ పిదప బంధుజనంబులతో భోజనంబునలిపి, బీదల కన్నంబిడినంత,

తే॥గీ॥ వారిపై వాహికా యుత్సవంబుజూడ
పౌరులందరు దయచేసి బాగుమీర
పట్టుబట్టలు రూకలు బట్టుకొనుచు
నెలమిజెంది గృహమ్ములకేగిరపుడు.

ఫలశ్రుతి

తే॥గీ॥ శ్రీనివాసుని పెండ్లిలిచెప్పుకొనిన
విన్నవారికి గూడను విష్ణుపదవి
గలిగి సుఖియింతురీకలికాలమందు
నెల్లభక్తులమనమురంజిల్లజేయ

సురట—మిశ్రచాపు

ప॥ మంగళమో శ్రీనివాస-మహితగుణవిశేషా

అ॥ రంగగుపద్మామనోభిలాషాసువిలాసా

చ॥ బంగరుశేషాచలేశ-మంగళవైకుంఠవాస
శృంగాలంకారవేష-వేంకటాచలేశయాళ ॥మం॥



గద్య

ఇత్యాది శ్రీతిరుపతివేంకటేశ్వర పాదారవింద సంతత సేవా సముత్సాహులుండును, నేమానవంశపయః పారావార సుధాకరులగు భారద్వాజ

సగోత్ర శర్మ నేమాని సుబ్బరాయుని

పుత్రుండును అయిన కవిరత్న నేమాని వేంకటకోటీశ్వరశర్మ ప్రణీతంబగు

శ్రీనివాసకల్యాణమను హరికథ సర్వం సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

మంగళం మహత్.





ఆసంవా ప్రింటర్సు, తిరుపతి. కా. 1000.